# హరస్తుతి







గరికపాటి లక్ష్మీకాంతయ్య, ఎం. ఏ.,

ఉపన్యాసకుఁడు - నిజాం కళాశాల

హైదరాబాదు (ద)

# HARASTUTI



By

G. LAKSHMIKANTAIAH M. A.,
*Lecturer in Telugu,*
NIZAM COLLEGE

WITH A FOREWORD

By

SRI ARYENDRA SHARMA, M. A. D. Phil.,
*Head of the Department of Sanskrit*
OSMANIA UNIVERSITY.
HYDERABAD - DECCAN



 1950 [Price : One Rupee

# विज्ञप्तिः

हरस्तुति रिय तत्र भवता मद्गुरुवर्येण शिरोमणिबिरुदभाजा सन्निधानोपाह्वेन श्री सूर्यनारायणशास्त्रिणा सदयं परिष्कृता। अत स्तस्याहमतीवाधमर्णतां गतः कृतज्ञश्च ॥

अस्याः स्तुतेः भूमिकारचयितुः उस्मानिया विश्वविद्यालय-संस्कृतशाखाध्यक्षस्य सुगृहीतनामधेयस्य आर्येन्द्रशर्मणश्च साञ्जलिरहं कृतज्ञताबद्धः ॥

अपिच सानुग्रह मभिप्रायदातॄणां पण्डितानां, प्रतिपदार्थतात्पर्य रचयितुः श्री को. मृत्युञ्जयशास्त्रिणश्च सप्रश्रयं कृतज्ञोऽस्मि ॥

इति बुधविधेयः
गरिकपाट्युपनामक लक्ष्मीकान्तः

# FOREWORD

The Stotra is a very important branch of Sanskrit Literature. Amongst the writers of Stotras are such eminent names as the Great Shankaracharya, Bana, Mayura and Pandita-raja Jagannadha. Sanskrit Stotras, apart from their devotional aspect, are characterised by lyrical qualities of a high order and a large number of them have been appreciated by critics as superb pieces of poetry. Many a Stotra-verse has found place in Sanskrit Anthologies and works on Rhetoric. It is regrettable that this branch of Sanskrit Literature has generally been ignored by our present day Pandits and Sanskrit students.

Pandit Lakshmikantaiah's effort in this direction, therefore, deserves encouragement and appreciation. The forty three verses of his *Harastuti* are composed in a vein of sincere devotion to Lord Siva and reveal the writer as an enthusiastic student of Sanskrit poetry.

The language and the style of these verses are free from artificiality and 'modernisation'; they are on a par with those of the older Stotra-writers. The sentiments and the ideas expressed in this poem are also of the real traditional nature.

*The Harastuti* was published in the well-known Sanskrit weekly of Ayodhya, *The Samskrutam* and was highly spoken of both by the editor of the Journal and several of its readers. It is on my suggestion that Pandit Lakshmikantaiah has arranged to bring out this poem in the form of a book-let, and I have every hope that it will be duly appreciated by the lovers of the Sanskrit poetry as well as by the devotees of the Great Lord. I congratulate the author on his really commendable performance,

*Hyderabad (Deccan)*
**5th may, 1949**

(*Sd.*) **Aryendra sharma**

# అ భి ప్రా య ము లు

" కావ్యపద్ధతౌచ విమృశ్యమానాయాం కావ్యశరీరిణో యావన్త్యపేక్షితా న్యంగాని శబ్దసౌష్ఠవం, అర్థగాంభీర్యం సహృదయహృదయాహ్లాదకాః, ఓజఃప్రసాదమాధుర్యాదిగుణాః, ఉపమాద్యలంకారాః, ద్రాక్షాపాకః, అనుగుణాచ శయ్యా—ఏవమాదిగుణైః ప్రాచీనాచార్యరచనా మనుసరతి"

ఇతి

'వ్యాకరణాచార్య'

(*Sd.*) కంభంపాటి రామమూర్తిశాస్త్రి

ప్రధానోపాధ్యాయః, సాంగవేదపాఠశాలా

మచిలీపత్తనం

**Ex. Principal, Sanskrit College, Tenali**

"ప్రాచార్యశైలీపరిశోభితాం కృతిం
హరస్తుతిం త్వత్ప్రచితాం సమీక్ష్య,
అమందమానంద మవాపమాంతం
పఠంస్తథాన్యైరపి పాఠయంశ్చ॥"

(*Sd.*) వేటూరి ప్రభాకరశాస్త్రి

**Oriental Research Institute, Tirupati**

**21—9—49**

The poem is classical both in content and form.

(*Sd.*) **Pingala Lakshmikantam,** M. A.,

**Reader, Andhra University,**

**Waltair, 25—9—49**

One of the numerous contemporaries in the field of original Sanskrit writing, Sri Garikipati Lakshmikantaiah of the Nizam College, Hyderabad, writes a traditional but simple style and has in the above mentioned Harastuti given us a hymn to Siva in forty verses, mainly in Sikharini and Bhujamgaprayata, in which not only phrases of devotional feeling but some philosophical ideas also are well expressed.

(*Sd.*) **V. Raghavan, Hindu**

**13th Nov. 49.**

శ్రీః

ఓం నమః శివాయ

# హరిస్తుతిః

వరాయాపర్ణాయా విజితనిధనాయాసురభయ
ఙ్కరాయాధేర్హర్త్రే మనసిజహరాయాష్టతనవే ।
పశూనామీశాయాఖిలభయహరాయాశ్రితశుభ
ఙ్కరాయేయం తుభ్యం హర! విరచితా స్యాన్మమ నతిః॥ 1

హర = ఓయీశ్వరా! అపర్ణాయాః = పార్వతికి, వరాయ = భర్తయైనట్టియు, విజితనిధనాయ = జయింపఁబడిన మృత్యువు గలిగినట్టియు (మృత్యుంజయుఁడవైనట్టి), అసురభయంకరాయ = రాక్షసులకు భయమును కలిగించునట్టియు, ఆధేః = మనోవ్యథయొక్క, హర్త్రే = వినాశకుడును, మనసిజహరాయ = మన్మథుని సంహరించినట్టియు, అష్టతనవే = ఎనిమిది శరీరములు కలిగినట్టియు, పశూనాం = ప్రాణులకు (జీవులకు), ఈశాయ = ప్రభువైనట్టియు, అఖిలభయహరాయ = అన్నిభయములను పోగొట్టునట్టియు, ఆశ్రితశుభంకరాయ = ఆశ్రితులకు శుభమునిచ్చువాఁడును నగు, తుభ్యం = నీకొఱకు, మమ = నాయొక్క, విరచితా = చేయఁబడిన, ఇయం నతిః = ఈ నమస్కారము, స్యాత్ = అగుగాక.

తాత్పర్యము. ఈశ్వరా! నే నీనమస్కారమును పార్వతీదేవి భర్తవును, మృత్యుంజయుఁడవును, రాక్షసభయంకరుఁడవును, మన్మథసంహారకుఁడవును, అష్టమూర్తివియు, పశుపతివియు, సర్వభయవినాశకుఁడవును, ఆశ్రితులకు శుభమొసంగు వాఁడవును అగు నీకొఱకు చేయుచున్నాను.

జటాజూటే జహ్నోర్దుహితరమహిం చైన్దవకలామ్
లలాటేఽగ్నిం కేతౌ వృషభమధికణ్ఠం హాలహాలమ్ ।

కరే శూలం స్వాఙ్కే గజవదన మద్రేస్సుతా
మశేషాఙ్గే భూతిం పురహర ! దధానో విజయసే॥ 2

పురహర = పురాసురుని సంహరించినవాఁడా ! జటాజూటే=జడల సమూహమునందు, జహ్నోః = జహ్నుమహర్షియొక్క, దుహితరం = కుమార్తెయగు గంగను, అహించ =సర్పమును, ఐన్దవకలామ్ = చంద్రకళను, లలాటే = నుదుట, అగ్నిమ్ = అగ్నిని, కేతౌ = జెండాయందు, వృషభమ్ = ఎద్దును, అధికంఠం = కంఠమునందు, హాలహాలమ్ = విషమును, కరే = చేతియందు, శూలం = శూలమును, స్వాఙ్కే = నీతొడయందు, గజవదనమ్ = గణేశుని, అద్రేఃసుతామపి = పార్వతీదేవిని, అశేషాఙ్గే = శరీరమందంతట, భూతిం=బూదిని; దధానః=ధరించుచున్నవాఁడవై, విజయసే= సర్వోత్కృష్టుఁడవగుచున్నావు.

తా॥ త్రిపురాసుర సంహారకా! నీవుజడలలో గంగను, పామును, చంద్రకళను, నొసటనగ్నిని, జెండాపై నెద్దును, కంఠమున విషమును, చేతిలో శూలమును, తొడలపై వినాయకుని, పార్వతిని, ఒడలంతయు బూదిని ధరించి అందఱికంటె గొప్పవాఁడవయితివి.

కదా వా సన్ధ్యాయాం రజతగిరికూటేఽమరగణే
స్తువత్యామ్నాయై స్త్వాం సమ మగజయా చ ప్రమథకైః ।
కరే ధృత్వా ఢక్కాం తవ విదధతస్తాణ్డవ మహో !
పురస్తా న్మే దృశ్యం పరిపతతి పుణ్యైకఫలకమ్॥ 3

హర = ఓయీశ్వరా! రజతగిరికూటే = కైలాసపర్వతశిఖరమునందు, సంధ్యాయాం = సాయంసమయమున, అమరగణే = దేవతాసమూహము, ఆమ్నాయైః = వేదమంత్రములచే, = త్వాం నిన్ను, స్తువతి=స్తోత్రము చేయుచుండఁగా, అగజయా = పార్వతితోడను, ప్రమథకైశ్చ = ప్రమథ గణములతోడను కూడ, కరే = చేతియందు, ఢక్కాం = డమరుకమును, ధృత్వా = ధరించి, తాండవం = నాట్యమును, విదధతః = చేయుచున్నట్టి,

తవ = నీయొక్క, పుణ్యైకఫలకం = పుణ్యమే ముఖ్యఫలముగాఁగల, దృశ్యం = దృశ్యము, మే = నాయొక్క, పురస్తాత్ = ఎదుట, కదావా = ఎప్పుడు, పరిపతతి = పడునో, అహో! = ఆశ్చర్యము.

తా॥ ఓయీశ్వరా! నీవు కైలాసశిఖరమునందు సాయంసమయమున దేవతలు వేదమంత్రములతో స్తోత్రముచేయుచుండ, చేతితోఁ ఢక్కను మ్రోగించుచు పార్వతితోడను, ప్రమథులతోడను గూడి తాండవ మొనర్చు దృశ్యము నేనెప్పుడు చూతునోగదా! ఎంతయోపుణ్యము చేసినగాని అట్టిది లభింపదు.

త్వమేకః ప్రాక్ సృష్టే రథ గుణవిభాగాయ బహుధా
త్వమేవాసీ ర్బ్రహ్మ త్వమసి వనమాలీ చ గిరిశః।
త్వమేవాస్యానన్ద స్త్వమసి పరమాత్మా విభు రసి
త్వమేవ ధ్యేయోఽసి త్వమసి హర! వేదాన్తవిషయః॥ 4

హర = ఓయీశ్వరా! సృష్టేః = సృష్టికి, ప్రాక్ = పూర్వము, త్వమ్ = నీవు, ఏకః = ఒక్కఁడవే, అథ = పిమ్మట, బహుధా = అనేకవిధములుగా, గుణవిభాగాయ = గుణవిభాగముకొఱకు, త్వమేవ = నీవే, బ్రహ్మ = బ్రహ్మవై, ఆసీః = ఉంటివి, త్వమ్ = నీవు, వనమాలీ = విష్ణువును, గిరిశశ్చ = శివుఁడును, అసి = అయితివి, ఆనందః = సంతోషము, త్వమేవ = నీవే, అసి = అగుచున్నావు, త్వమ్ = నీవు, పరమాత్మా = ఉత్కృష్టమైన ఆత్మవు, అసి = అగుచున్నావు, విభుః = సర్వవ్యాపివి, అసి = అగుచున్నావు, త్వమేవ = నీవే, ధ్యేయః = ధ్యానము చేయఁబడఁదగిన వాఁడవును, అసి = అగుచున్నావు, త్వమ్ = నీవు, వేదాన్తవిషయః = వేదాన్తమునకు లక్ష్యమైనవాఁడవు, అసి = అగుచున్నావు.

తా॥ ఓయీశ్వరా! సృష్టికిపూర్వము నీవొక్కఁడవే. పిమ్మట గుణవిభాగముకొఱకు అనేక రూపములదాల్చి బ్రహ్మ, విష్ణు, మహేశ్వరనామములతోఁ పేర్కొనబడితివి. నీవే ఆనందమును, పరమాత్మయు, సర్వవ్యాపివి. ధ్యానయోగ్యుఁడవును నీవే. వేదాన్తములు నిన్నుగూర్చియే బోధించును.

యతో భీతో వాయుర్వహతి సవితోదే త్యహరహ
స్ద్రవత్యమ్భో వహ్నిర్జ్వలతి మఘవా వర్షతి తథా ।
ఫలత్యుర్వీ ధర్మం చరతి యమునాయాశ్చ సహజ
స్తదేవ త్వాం బ్రహ్మే త్యభిదధతి సన్తః పశుపతే॥ 5

పశుపతే=ఓయీశ్వరా! అహరహః = ప్రతిదినము, యతః = దేనివలన, భీతః = భయపడినదై, వాయుః = గాలి, వహతి = వీచుచున్నదో, సవితా = సూర్యుడు, ఉదేతి = ఉదయించుచున్నాడో, అంభః = ఉదకము, ద్రవతి = ద్రవించుచున్నదో, వహ్నిః = అగ్ని, జ్వలతి = మండుచున్నదో, తథా = అట్లే, మఘవా = ఇంద్రుడు, వర్షతి = వర్షించుచున్నాడో, ఉర్వీ = భూమి, ఫలతి = ఫలించుచున్నదో, యమునాయాః = యమునకు, సహజశ్చ= సోదరుడగుయముడును, ధర్మం=ధర్మమును, చరతి = ఆచరించుచున్నాడో, తత్ = ఆ, త్వామేవ=నీవే, బ్రహ్మఇతి = బ్రహ్మమని, సన్తః = సత్పురుషులు, అభిదధతి = చెప్పుచున్నారు.

తా॥ ఓయీశ్వరా! సత్పురుషులు నిన్ను బ్రహ్మపదార్థముగ చెప్పుదురు. ఆ బ్రహ్మపదార్థమువలననే భయపడి వాయువు, సూర్యుడు, అగ్ని, మేఘము, భూమి, యముడు మున్నగువారు తమ తమ విధ్యుక్త కార్యములను నెరవేర్చుచున్నారు గదా!

యతో భూమి స్తోయం జ్వలనపవనౌ వ్యోమ చ మనో
దిగాత్మానౌ కాల స్సకలమపి జాతం జగ దిదమ్ ।
యదా స్తే పారే వాఙ్మనస మహాసాక్షాచ్చాఽపి తమసామ్
తదేవ త్వాం బ్రహ్మే త్యభిదధతి సన్తః పశుపతే॥ 6

పశుపతే = ఓయీశ్వరా! యతః = దేనివలన, భూమిః = భూమియు, తోయం = నీరు, జ్వలనపవనౌ = అగ్నివాయువులు, వ్యోమ=ఆకాశమును, మనశ్చ = మనస్సును, దిగాత్మానౌ=దిక్కులు, ఆత్మయు, కాలః=కాలము, ఇదమ్ = ఈ, సకలమ్=సమస్తమైన, జగదపి = జగత్తును, జాతమ్=పుట్టెనో,

యత్ = ఏది, వాఙ్మనసమహసాం = వాక్కు, మనస్సు, తేజస్సులకు, తమసామపిచ = చీకటులకును, పారే = అవతల, ఆస్తే = ఉన్నదో, తత్ = ఆ, త్వమేవ = నీవే, బ్రహ్మేతి = బ్రహ్మమని, సన్తః = సత్పురుషులు, అభిదధతి = చెప్పుచున్నారు.

ఓయీశ్వరా ! భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, దిక్కులు, ఆత్మ, కాలము ఈ ప్రపంచమంతయు దేనివలన పుట్టెనో, ఏది అవాఙ్మానసగోచరమో, ఏది వెలుగు చీకటుల కవతలనున్నదో ఆ నీవే బ్రహ్మ మని సత్పురుషులు నుడువుచున్నారు.

నిరాకారం సత్యం పరమపురుషం ధ్యానసుగమమ్
పురాణం సర్వజ్ఞం పర మతుల మాద్యన్తరహితమ్ ।
త్రయీగేయం జ్ఞేయం కలుషరహితం జ్ఞాననిలయమ్
చిదానన్దం శాన్తం నిజహృది భవన్తం హర ! భజే॥ 7

హర = ఓ యీశ్వరా ! నిరాకారం = రూపములేనివాఁడును, సత్యం = సత్యమైనవాఁడును, పరమపురుషం = గొప్పపురుషుఁడును, ధ్యానసుగమం = ధ్యానముచేత సుఖముగా పొందశక్యమయినవాఁడును, పురాణం = ప్రాచీనుఁడును, సర్వజ్ఞం = అన్నియు తెలిసినవాఁడును, పరమ్ = అన్నిటికంటె శ్రేష్ఠుఁడును, అతులం = సామ్యములేనివాఁడును, ఆద్యన్తరహితం = మొదలు తుదలేనివాఁడును, త్రయీగేయం = మూఁడువేదములచే స్తోత్రముచేయఁబడువాఁడును, జ్ఞేయం = తెలియఁదగినవాఁడును, కలుషరహితం = పాపములేనివాఁడును, జ్ఞాననిలయం = జ్ఞానమునకు స్థానమైనవాఁడును, చిదానన్దం = చిదానన్దం స్వరూపుఁడును, శాన్తం = శాన్తుఁడును, అయిన, భవన్తం = నిన్ను, నిజహృది = నా మనస్సునందు, భజే = సేవించుచున్నాను.

తా॥ ఓ యీశ్వరా ! నీవు నిరాకారుఁడవు. సత్యస్వరూపుఁడవు. పరమపురుషుఁడవును. ధ్యానముచే నిన్ను సులభముగ పొందవచ్చును. నీవు పురాణపురుషుఁడవు. సర్వజ్ఞుఁడవు. సాటిలేని వాఁడవును. నీకు ఆద్యన్తములు

లేవు. వేదములు నిన్ను స్తుతించును. నీవు పాపరహితుఁడవు. జ్ఞాననిలయుఁడవై తెలిసికొనఁదగినయుఁన్నావు. చిదానన్దస్వరూపుఁడును, శాన్తమూర్తియునైన నిన్ను నా మనస్సనం దెప్పుడును సేవించెదను.

ప్రభో ! మజ్జిహ్వా త్వాం వదతు, నమతు త్వాం మమ శిర,
స్త్రిలోక్యైకారాధ్యే త్వయి భవతు సక్తం మమ మనః ।
యజేతాం పాణీ త్వచ్చరణయుగళం మఙ్గళమయమ్,
దృశౌ వీక్షేతాం మే లలితలలితం తావకవపుః॥ 8

ప్రభో = ఓ యీశ్వరా ! మజ్జిహ్వా = నా నాలుక, త్వాం = నిన్ను, వదతు = చెప్పుగాక, మమ = నాయొక్క, శిరః - శిరస్సు, త్వాం = నిన్ను, నమతు = నమస్కరించుగాక, త్రిలోక్యైకారాధ్యే = మూడు లోకములలో ముఖ్యముగా పూజనీయుఁడవగు, త్వయి = నీయందు, మమ = నాయొక్క, మనః = మనస్సు, సక్తం = తగిలినది, భవతు = అగుగాక, పాణీ = చేతులు, మంగళమయం = మంగళస్వరూపమైన, త్వచ్చరణయుగళం = నీ పాదముల జంటను, యజేతాం = సేవించుగాక, మే = నాయొక్క, దృశౌ = చూపులు, లలితలలితం = మిక్కిలి సుందరమైన, తావకవపుః = నీయొక్క శరీరమును, వీక్షేతాం = చూచుగాక.

తా. ఓ యీశ్వరా ! నా నాలుక ఎప్పుడును నిన్నుగూర్చి పలుకవలెననియు, నా శిరము నిన్నుఁగూర్చి నమస్కరింపవలెననియు, నా మనస్సు త్రిలోక పూజనీయుఁడవగు నీయందే యుండవలెననియు, నా చేతులు శుభప్రదములగు నీ పాదములను సేవింపవలెననియు, నా చూపులు మిక్కిలి సుందరమగు నీ శరీరమును చూచుచుండవలెననియు నా యభిలాష.

అతీత్య ద్వన్ద్వాని శ్రితనిబిడవృక్షాశ్రమభువో
విరుధ్య ప్రాణాదీం స్త్వయి నిహితభావాః స్థిరధియః ।
సమాధిస్థా స్సమ్యగ్గలితమమతాధ్వాన్తపటలా
న శక్తా స్త్వాం జ్ఞాతుం కిల యతివరాః కా మమ కథా॥ 9

హర = ఓ యీశ్వరా ! ద్వంద్వాని = శీతోష్ణములను, సుఖదుఃఖము లను, అతీత్య = దాటి శ్రితనిబిడవృక్షాశ్రమభువః = ఆశ్రయింపఁబడిన దట్టమైన చెట్లుగల ఆశ్రమ ప్రదేశములు కలవారై, ప్రాణాపేక్ష = ప్రాణము మొదలగు వాయువులను, నియమ్య = నిరోధించి, త్వయి=నీయందు, నిహితభావాః = ఉంచబడిన భావము కలవారై, స్థిరధియః=నిశ్చలబుద్ధి గలవారై, సమాధిస్థాః= సమాధిలోనున్నవారగుచు, సమ్యగ్దలితమమతాధ్వాంతపటలాః = బాగుగా నశింపఁజేయఁబడిన మమకారమను చీకటి సమూహము కలిగినవారై, యతివరాః = గొప్పసన్యాసులు, త్వాం=నిన్ను, జ్ఞాతుం = తెలిసికొనుటకు, నశక్తాః కిల = సమర్థులుకారట, కా మమకథా=నావిషయము మిఁక నేమి చెప్పవలెను ?

తా. ఓ యీశ్వరా ! శీతోష్ణముల నతిక్రమించి, అడవులలో ఆశ్రమముల నేర్పఱచుకొని, ప్రాణవాయువుల నిరోధించి, నీయందు నిశ్చలముగా మనస్సు నిలిపి సమాధియందుండి మమకారమను చీకటిని నశింపజేసిన మునీశ్వరులే నిన్ను తెలిసికొన లేరన్నచో నిఁక నా విషయ మేమి చెప్పవలెను ?

**ఇయం మే మాతాఽయం మమ ఖలు పితాఽయం మమ గురుః**
**ప్రియేయం మే పత్నీ మమ చ తనయా బన్ధవ ఇమే ।**
**అమీ భృత్యా గేహం మమ ధన మిదం చేతి మమతా**
**వృతస్త్వాం నో విద్యాం స్వవిభు మనఘం త్వాం హర! కథమ్॥10**

హర = ఓ యీశ్వరా ! ఇయం = ఈమె, మే = నాయొక్క, మాతా = తల్లి, అయం = ఇతఁడు, మమ = నాయొక్క, పితాఖలు = తండ్రి గదా, అయం = ఇతఁడు, మమ = నాయొక్క, గురుః = గురువు, ఇయం = ఈమె, మే = నాయొక్క, ప్రియా = ఇష్టురాలైన,పత్నీ = భార్య,ఇమే = వీరు,మమ=నాయొక్క, తనయాః=కుమారులు, బంధవశ్చ = బందుగులును, అమీ = వీరు, భృత్యాః = సేవకులు, ఇదం = ఇది, మమ = నాయొక్క, గేహం = ఇల్లు, ధనంచ = ధనమున్ను, ఇతి = అని , మమతా

వృతస్వాన్తః = మమకారముచేత ఆవరింపఁబడిన మనస్సుకల, అహం = నేను, స్వవిభుం = నాకు ప్రభువయినట్టియు, అనఘం = పాపరహితుఁడవగు, త్వాం = నిన్ను, కథమ్ = ఎట్లు, విద్యాం = తెలిసికొందును ?

తా. ఓ యీశ్వరా ! ఈమె నాతల్లి, ఇతఁడు నాతండ్రి, ఇతఁడు నాగురువు, ఈమె నాభార్య, వీరు నాకుమారులు, బంధువులు, సేవకులును, ఇది నాయిల్లు, ఇది నాసొత్తు అను మమకారముతో కూడినది నామనస్సు. అట్టి మనస్సుగల నేను నా ప్రభువును, అనఘాత్ముఁడు నగు నిన్నెట్లు తెలిసికొనఁగలను ?

ధనాభావం నైజం పరధనసమృద్ధిం చ కుజనః
స్వకీయం నైర్గుణ్యం పరసుగుణతాం వీక్ష్య విమనాః ।
అసూయ త్యన్యేభ్య స్తపతి హృదయే ద్వేష్టి చ ముధా
భవన్తం త్వత్పక్ష్యః క్వ భవతి ఫలం కర్మసదృశమ్ ॥ 11

హర = ఓ యీశ్వరా ! కుజనః = దుష్టుఁడు, నైజం = తనదియగు, ధనాభావం = దారిద్ర్యమును, పరధనసమృద్ధించ = ఇతరుల భాగ్యమును, స్వకీయం = తనసంబంధమైన, నైర్గుణ్యం = గుణహీనత్వమును, పరసుగుణతాం = ఇతరులు మంచిగుణములు కలిగియుండుటను, వీక్ష్య = చూచి, విమనాః = చెడ్డతలంపు కలవాఁడై, అన్యేభ్యః = ఇతరులకొఱకు, అసూయతి = అసూయపడుచున్నాఁడు. హృదయే = మనస్సునందు, తపతి = బాధపడుచున్నాఁడు, ముధా = వ్యర్థముగా, భవన్తం = నిన్ను, ద్వేష్టి చ = ద్వేషించుచున్నాఁడు, త్వత్పక్ష్యః = నీవు పక్షపాతము వహింపఁదగినవాఁడు, క్వ = ఎక్కడ, భవతి = ఉండును, ఫలం = ఫలము, కర్మసదృశం = కర్మకుఁదగినదై, భవతి = ఉండునుగదా !

తా. ఈశ్వరా ! దుష్టుఁడు తనలేమిని, గుణహీనత్వమును, ఇతరుల ఐశ్వర్యమును, సుగుణవత్త్వమును చూచి ఓర్వలేక చాల బాధపడును. నిన్ను

వృథాగా క్లేశించెదను. కాని నీ వెవరియందును పక్షపాతము చూపవు. ఎవని కర్మకుఁదగిన ఫలము వానికి లభించును గదా !

కృతీ శూరోఽద్యాహం నవనవవయోరూపసుభగో
ఽచిరంహృద్యా మీడ్యాం సుగుణనిలయాం సూరికులజామ్ ।
వధూం పాణౌకృత్వాధిగతతనయ శ్చార్జితవసు
ర్భవిష్యామీత్యాశాకలుషితమతిస్స్యా ద్ధర ! నరః ॥ 12

హర = ఓ యీశ్వరా ! నరః = మనుష్యుఁడు, అద్య = ఇప్పుడు, అహం = నేను, కృతీ - నేర్పరిని, శూరః = పరాక్రమశాలిని, నవనవవయోరూపసుభగః = మిక్కిలి లేతవయస్సౌందర్యములతో అందమైనవాఁడను, అచిరం = కొలది కాలములో, హృద్యాం = మనోహరమైనదియు, ఈడ్యాం = కొనియాడఁదగినదియు, సుగుణనిలయాం = మంచి గుణములు కలదియు, సూరికులజాం = పండితవంశమునఁబుట్టినదియు నగు, వధూం = స్త్రీని, పాణౌ కృత్య = వివాహమాడి, అధిగతతనయశ్చ = పొందఁబడినకుమారులు కల వాఁడను, ఆర్జితవసుశ్చ = సంపాదింపఁబడిన ధనము కలవాఁడను, భవిష్యామి = కాఁగలను, ఇతి = అని, ఆశాకలుషితమతిః = ఆశచేత చెడిన బుద్ధికలవాఁడు. స్యాత్ = అగును.

తా. ఈశ్వరా ! మనుష్యుఁడు తాను నేర్పరియు, శూరుఁడును, సౌందర్యవంతుఁడును, అని భావించుచు తొందరలో అందమైనదై సుగుణవతియగు స్త్రీని పెండ్లాడి, సంతానముబడసి, ధనమార్జించి గొప్పవాఁడను కాఁగలనని ఆశపడుచు బుద్ధిచెడగొట్టుకొనుచుండును. అనగా సంసారబంధములోఁ జిక్కుకొనుటకు యత్నించుచున్నాఁడు. నీకు దూరస్థుఁడగుచున్నాఁడు.

జనా మూఢా లోకే నిజసుతసతీపాలనపరాః
అవాప్తా వర్తానాం తదవనవిధౌ చ ప్రతిదినమ్ ।

సహన్తే యా న్క్లేశా న్విగలదిహ వాంఛాః స్థితధియ
స్తదంశేనాఽపి స్యు ర్హర ! దలితబన్ధా స్త్వయి రతాః ॥ 1

హర = ఓ యీశ్వరా! లోకే = లోకమునందు, మూఢాః = మూఢులగు, జనాః = జనులు, నిజసుతసతీపాలనపరాః = తమ పెండ్లాము బిడ్డలః పోషించుటయందు దాసక్తులై, అర్థానాం = ధనముక్కు, అవాప్తౌ = పొందుటయందును, తదవనవిధౌ చ= దానిని రక్షించుటయందును, ప్రతిదినమ్ నిత్యమును, యాన్ క్లేశాన్ = ఏకష్టములను, సహన్తే = సహించుచున్నారో తదంశేనాపి = వానిలో ఒకభాగము చేతనైనను, విగలదిహవాంఛాః = జారిపోవుచున్న ఈ లోకపు కోరికగలవారును, స్థితధియః = నిశ్చలమగు బుద్ధి గలవారునై, త్వయి = నీయందు, యది రతాః = ఆసక్తులయిన యెడల, గలితబంధాః = జారిన బంధముకలవారు, స్యుః = అగుదురు.

తా॥ ఈశ్వరా! లోకములో మూఢజనులు తమఆలుబిడ్డలను పోషించుకొనుటకు ధనమార్జించి రక్షించుటలో పడు కష్టములలో నొక వీసమైనను ఇహలోక వాంఛలను వదలి నిన్ను నిశ్చలబుద్ధితో ధ్యానించినచో సంసార బంధమునుండి విడివడుదురుగదా !

యశస్వీ తేజస్వీ ధనపతి రధీశోఽమితభువః
కృతీ భూయాసం; మే భవతు సురలోకే సుఖమితి ।
జడాత్మారాధ్యాఽన్యాన్ స్వఫలమధిగమ్యాఽపి సుకృతేః
క్రమాత్ క్షీణే పుణ్యే పతతి నరయోనౌ ఖలు పునః ॥ 14

హర = ఓ యీశ్వరా! జడాత్మా = మందబుద్ధియైన మనుష్యుఁడు, తాను, యశస్వీ = కీర్తిమంతుఁడు, తేజస్వీ = తేజశ్శాలియు, ధనపతిః = ధనవంతుఁడును, అమితభువః = మితిలేనిభూమికి, అధీశః = ప్రభువును, కృతీ = నేర్పరిని, భూయాసం=అగుదును, మే = నాకు, సురలోకే = స్వర్గలోకము

నందు, సుఖమ్ = సుఖము, భవతు = అగుగాక, ఇతి=అని, అన్యాన్ = ఇతరదేవతలను, ఆరాధ్య = పూజించి, సుకృతేః = పుణ్యముయొక్క, స్వఫలమ్=తనఫలమును, అధిగమ్యాఽపి = పొందియును, క్రమాత్ = క్రమముగా, పుణ్యే = పుణ్యము, క్షీణే= క్షీణించినదికాగా, పునః = తిరిగి, నరయోనౌ = మనుష్యయోనియందు, పతతి ఖలు = పడుచున్నాడుగదా!

తా॥ ఈశ్వరా! మూర్ఖుడు తాను కీర్తిమంతుడు, తేజశ్శాలి, ధనవంతుడు, చక్రవర్తి అయి ప్రయోజకుడగుదుననియు, తనకు స్వర్గసుఖ మొనగూడుననియు, ఇతరదేవతలను పూజించును. కాని పుణ్యఫలము పొందినను అదిక్షీణింపగానే తిరిగి మనుష్యజన్మము పొందుచునేయున్నాడుగదా!

అత శ్చేతోభృఙ్గ మమ విషయధుత్తూరకుసుమమ్
పరిత్యజ్యాఽశ్రాన్తం తవచరణపఙ్కేరుహయుగే ।
ఉషిత్వా తత్రత్యం మధురమకరన్దం కరుణయా
తవాస్వాద్యానన్దం హర నిరుపమానం హి లభతామ్॥ 15

హర = ఓ యీశ్వరా! అతః = ఇందువలన, మమ = నాయొక్క, చేతోభృఙ్గః = మనస్సనెడి తుమ్మెద, విషయధుత్తూరకుసుమమ్ = వస్తుజాతమనెడి ఉమ్మెత్తపువ్వును, పరిత్యజ్య = వదలి, అశ్రాన్తం = ఎల్లప్పుడు, తవ = నీయొక్క, చరణపఙ్కేరుహయుగే= పాదపద్మముల జంటయందు, ఉషిత్వా = ఉండి, తత్రత్యం = అక్కడనున్న, మధురమకరందం= తీయని తేనెను, తవ=నీయొక్క, కరుణయా=దయచేత, ఆస్వాద్య = త్రాగి, నిరుపమానం = సాటిలేని, ఆనందం=ఆనందమును, లభతామ్ = పొందుగాక.

తా. ఈశ్వరా! ఇతరుల నాశ్రయించుట శ్రేయోదాయకము కాదుగావున నా మనస్సనెడి తుమ్మెద విషయజాత మను ఉమ్మెత్తపూవును వదలి ఎప్పుడును నీ పాదపద్మముల జంటయందలి తీయని తేనెను గ్రోలుచు నీ దయచేత సాటిలేని ఆనందానుభవము పొందుగాక!

కదా కాశీం గత్వా దురితహరగంగాంభసి పునః
పునస్స్నాత్వా నత్వా గిరిశ మనఘస్స్యామితి మతిమ్ ।
కరోత్వన్యో లోకే నిజహృదయనీరేజవసతే
ర్విధాయాఽహం సేవాం తవ హర! లభే హ్యైక్య మచిరాత్ ॥16

హర = ఓ యీశ్వరా ! లోకే = లోకమునందు, అన్యః = ఇతరుఁడు; కదా = ఎప్పుడు, కాశీం = కాశీపట్టణమునుగూర్చి, గత్వా = వెళ్ళి, దురితహర గంగాంభసి = పాపమును పోగొట్టునట్టి గంగోదకమునందు, పునఃపునః = మాటిమాటికి, స్నాత్వా = స్నానముచేసి, గిరిశం = ఈశ్వరుని, నత్వా = నమస్కరించి, అనఘః = పాపరహితుఁడను, స్యాం = అగుదునో, ఇతి = అని, మతిమ్ = ఆలోచనను, కరోతు = చేయుగాక, అహం = నేను, నిజహృదయనీరేజవసతేః = నాహృదయపద్మమునందు వసించిన, తవ = నీయొక్క, సేవాం = సేవను, విధాయ = చేసి, అచిరాత్ = శీఘ్రముగా, ఐక్యమ్ = ఏకీభావమును, లభేయమ్ = పొందుదును.

తా. ఈశ్వరా ! లోకములో నెవఁడైనను కాశికిఁబోయి పాపమును హరించునట్టి గంగోదకమున స్నానమాడి శివుని దర్శించి పాపరహితుడ నెప్పుడగుదునాయని ఉత్సాహ్యులగుగాక, నేను మాత్రము నాహృదయమునందే నిలచియున్న నిన్ను సేవించి శీఘ్రముగా నీలో నైక్యము కాగలను.

పురఃపశ్చాదన్తర్బహిరఖిలదిగ్వీథిషు జలే
క్షితావాకాశేఽధో మహతి చ సుసూక్ష్మేఽర్థనిసరే ।
నరే కీటే వృక్షే జగతి పరితో వ్యాప్య నిబిడమ్
స్థితం త్వాం పశ్యామి ప్రభువర ముమానాథ ! మనసి ॥ 17

ఉమానాథ = పార్వతీభర్తవగు నోయీశ్వరా ! పురః = ఎదుటను, పశ్చాత్ = వెనుక, అన్తః = లోపలను, బహిః = బయటను, అఖిల

దిగ్వీథిషు = సర్వదిక్కులయందును, జలే = నీటియందు, క్షితౌ = భూమియందు, ఆకాశే = ఆకాశమునందును, మహతి = పెద్దదియును, సూక్ష్మే చ = మిక్కిలి చిన్నదియునగు, అర్థనిచయే = వస్తుసముదాయమునందును, నరే = మనుష్యునియందు, కీటే = పురుగునందు, వృక్షే = చెట్టునందు, జగతి = జగత్తునందు, పరితః = అంతటను, వ్యాప్య = వ్యాపించి, నిబిడం = దట్టముగా, స్థితం = ఉన్నటువంటి, ప్రభువరం, గొప్పప్రభువగు, త్వాం = నిన్ను, మనసి = మనస్సునందు, పశ్యామి = చూచుచున్నాను.

తా. ఈశ్వరా ! నీవు ముందువెనుకలను, లోపల వెలుపలను, సర్వదిక్కులయందును, భూమి నీరు ఆకాశము పాతాళమునందును, మిక్కిలి పెద్దది మిక్కిలి చిన్నదియగు వస్తువునందును, మానవునిలోను, పురుగులోను, చెట్టులోను, జగత్తునందంతటను దట్టముగ వ్యాపించియున్నావు. అట్టి ప్రభుశ్రేష్ఠుఁడవగు నిన్ను నేను నాహృదయములో చూచుచున్నాను.

యథా లోకే హంసో బిసకిసలయచ్ఛేద మనిశమ్
రసాలం రోలంబో నవఘనపయశ్చాతకశిశుః ।
హవిస్త్రేతా శుక్తి ర్జలదగలితం స్వాతిసలిలమ్
తథేదం చిత్తం మేఽభిలషతి హర ! త్వాం మహరహః ॥ 18

హర = ఓయీశ్వరా ! లోకే = లోకమునందు, హంసః = రాజహంస, బిసకిసలయచ్ఛేదమ్ = లేతతామరతూడు ముక్కను, అనిశమ్ = ఎల్లప్పుడు, యథా = ఎట్లు, అభిలషతి = కోరునో, రోలంబః = తుమ్మెద, రసాలం = మామిడిపూవును, చాతకశిశుః = చాతకపక్షి, నవఘనపయః = క్రొత్త మేఘపు నీటిని, త్రేతా = అగ్నిత్రయము, హవిః = హవిస్సును, శుక్తిః = ముత్యపుచిప్ప, జలదగలితం = మేఘమునుండిపడిన, స్వాతిసలిలం = స్వాతికార్తెయందలినీటిని, యథా = ఎట్లు, అభిలషతి = కోరునో, తథా = అప్రకారముగా, ఇదం = ఈ, మే = నాయొక్క

చిత్తం = మనస్సు, = త్వాం = నిన్ను, అహరహః = దినదినమును, అభిలషతి = కోరుచున్నది.

తా. ఈశ్వరా! లోకములో హంస ఎల్లప్పుడును తామరతూడు నే ఎట్లు కోరునో, తుమ్మెద మామిడిపూవును, చాతకపక్షి క్రొత్తమేఘపునీటిని, అగ్ని త్రియము హవిస్సును, ముత్యపుచిప్ప స్వాతివానను ఎట్లుకోరునో అట్లే యీనా మనస్సుకూడ ఎప్పుడును నిన్నే కోరుచుండును.

యథా నష్టమార్గో వృతః క్రూరసత్త్వై
ర్నిజాం భీతభీతః ప్రసూమేతి వత్సః ।
కుమార్గం సమేత్యారిభిః పీడితా మే
స్తథా త్వాం మతి శ్శ్రయ త్యుత్సవాయ ॥ 19

హర = ఓ యీశ్వరా! యథా = ఏవిధముగా, వత్సః = దూడ, నష్టమార్గః = దారితప్పినదై, క్రూరసత్త్వైః = దుష్టమృగములచేత, వృతః = ఆవరింపఁబడినదై, భీతభీతః = మిక్కిలిభయపడి, నిజాం = తనసంబంధమైన, ప్రసూమ్ = తల్లిని, ఏతి = పొందుచున్నదో, తథా = అట్లే, కుమార్గం = చెడుమార్గమును, సమేత్య = పొంది, అరిభిః = కామక్రోధాదులను శత్రువులచే, పీడితా = బాధింపఁబడినదై, మే = నాయొక్క, మతిః = బుద్ధి, త్వాం = నిన్ను, ఉత్సవాయ = సంతోషముకొఱకు, శ్రయతి = ఆశ్రయించుచున్నది.

తా॥ ఈశ్వరా! ఆవుదూడ దారి తప్పి క్రూరమృగములు వెంబడింప చాల భయపడి పరుగిడి తన తల్లిని ఏవిధముగా చేరుచున్నదో అట్లే నా బుద్ధి కూడ చెడు మార్గమున ప్రవేశించి కామక్రోధాదులచే పీడింపఁబడి నిన్ను ఆశ్రయించి ఆనందింప గోరుచున్నది.

గజాన్తాం విభూతిం మహారాజ్యపట్టమ్
సురేంద్రాధిపత్యం చ నో కామయే ఽహమ్ ।

పరం కేవలా త్వత్పదాబ్జాబ్జసేవా
ప్రభో ! రోచతే మే సదా పాహి మాం భోః ॥ 20

ప్రభో = ఓ యీశ్వరా ! అహం = నేను, గజాన్తాం = ఏనుగులు అంతముగాగల, విభూతిం = సంపదను, మహారాజ్యపట్టమ్ = గొప్పరాజ్యపట్టాభిషేకమును, సురేంద్రాధిపత్యంచ = దేవేంద్రపదవినిగాని, నోకామయే = కోరను, పరంకేవలా = మిక్కిలి ప్రత్యేకమైన, త్వత్పదాబ్జాబ్జసేవా = నీపాదపద్మముల సేవ, మే = నాకు, సదా = ఎల్లప్పుడు, రోచతే = ఇష్టమగును, మాం = నన్ను సదా = ఎల్లప్పుడు, పాహి = రక్షించుము.

తా॥ ఈశ్వరా ! నేను గజాంతమగు నైశ్వర్యమునుగాని, గొప్పరాజ్య పట్టాభిషేకమునుగాని, దేవేంద్రపదవినిగాని కోరుటలేదు. నీ పాదపద్మముల సేవ మాత్రమే నాకిష్టమగును. ప్రభూ ! నన్నెప్పుడును కాపాడుము.

త్వమేవ త్వమేవ త్వమేవ త్వమేవ
త్వమేవాఽస్యభీష్టం పరం దైవతం మే ।
త్వదన్యం న జానే న వీక్షే న కాఙ్క్షే॥
న సేవే న వన్దేఽభిగమ్యస్త్వమేవ॥ 21

హర = ఓయీశ్వరా ! త్వమేవ = నీవే, మే = నాయొక్క అభీష్టం = మిక్కిలి ప్రియమైనట్టియు, పరమ్ = గొప్పవాడవైన, దైవతమ్ = దేవుడవు, అసి = అగుచున్నావు, త్వదన్యం = నీకంటె ఇతరుని, నజానే = ఎఱుగను, నవీక్షే = చూడను, = నకాంక్షే = కోరను, నసేవే = సేవింపను, నవందే = నమస్కరింపను, అభిగమ్యః = పొందదగినవాడవు, త్వమేవ = నీవే.

తా. ఈశ్వరా ! ముమ్మాటికిని నీవే నాకు మిక్కిలి యిష్టమైన గొప్ప దేవుడవు. నీకంటె వేరు దైవము నెఱుగను, చూడను, కోరను, సేవింపను, నమస్కరింపనుగూడ. నీవే నాగమ్యస్థానము.

దరిద్రం తనోషీశ్వరం సర్వభూమే
స్తథా సార్వభౌమం ముహూర్తా ద్దరిద్రమ్ ।
ధర స్యూర్ధ్వమేకం మహాదుఃఖమగ్నమ్
తథాఽధః క్షిప స్యన్య ముద్యత్సుఖేభ్యః ॥ 22

హర = ఓయీశ్వరా! నీవు, దరిద్రం = దరిద్రుని, సర్వభూమేః = భూమికంతటను, ఈశ్వరం = ప్రభువునుగా, తనోషి = చేయుచున్నావు; తథా = ఆ విధముగానే, సార్వభౌమం = చక్రవర్తిని, ముహూర్తాత్, క్షణములో, దరిద్రం = దరిద్రునిగా, తనోషి = చేయుచున్నావు, మహాదుఃఖమగ్నం = గొప్ప దుఃఖములో మునిగిన, ఏకం = ఒకనిని, ఊర్ధ్వం, ధరసి = పైకి తీసికొనివచ్చుచున్నావు, తథా = అట్లే, అన్యం ఒకానొకనిని, ఉద్యత్సుఖేభ్యః = గొప్పసుఖములనుండి, అధఃక్షిపసి = క్రిందకు పడనేయుచున్నావు.

తా. ఈశ్వరా! నీవు దరిద్రుని ప్రభువుగాను, ప్రభువును దరిద్రునిగాను క్షణకాలములో నొనర్పసమర్థుడవు. దుఃఖమగ్నుడైనయొకనిని నీవుద్ధరింతువు. సుఖభోగి నొకనిని తలక్రిందు జేయుదువు. ఇది యంతయు నీ యిచ్ఛ.

క్షణాత్పూర్వ మమ్భోవిహీనం సరో యత్
క్షణాదూర్ధ్వ మంబుప్రవాహైః పృణాసి ।
క్షణాత్పూర్వ మభ్రై స్సధారై ర్నదద్భి
ర్వృతం ద్రాగ్విహాయః కరోషి ప్రశాన్తమ్ ॥ 23

హర = ఓయీశ్వరా! క్షణాత్పూర్వం = క్షణకాలము వెనుక, యత్ సరః = ఏ సరస్సు, అంభోవిహీనం = నీళ్లులేనిదో, తత్ = దానిని, క్షణాదూర్ధ్వం = క్షణమయినపిమ్మట, అంబుప్రవాహైః = నీటి ప్రవాహములతో, పృణాసి = నిండించుచున్నావు.

క్షణాత్పూర్వం = క్షణకాలము వెనుక, సధారైః = ధారలతోకూడిన, నదద్భిః = మ్రోగుచున్నట్టి, అభ్రైః = మేఘములతో, వృతం = ఆవరింపఁబడిన, విహాయః = ఆకాశమును, ద్రాక్ = శీఘ్రముగా, ప్రశాంతమ్ = నిర్మలమైన దానినిగా, కరోషి = చేయుచున్నావు.

తా॥ ఈశ్వరా ! నీవు క్షణముక్రిందటం నీరులేని సరస్సును, చూచుచుండగనే నీటి ప్రవాహముతో నింపుదువు. ఉఱుముచు వర్షించునట్టి మేఘములతోనిండిన ఆకాశమును ఒక్క త్రుటిలో స్వచ్ఛమొనర్తువు.

సృజ స్యబ్జయోనిః ప్రభో ! సర్వలోకాన్
హరి ర్ధారయ స్యాదరా త్ప్రాణిజాతమ్ ।
హర స్యుగ్రరూపః ప్రమేయం సమస్తమ్
క ఈష్టేఽవగన్తుం తవేదృఙ్మహత్త్వమ్ ॥ 24

ప్రభో - ఓయీశ్వరా !, అబ్జయోనిః = బ్రహ్మవై, సర్వలోకాన్ = సమస్తలోకములను, సృజసి = సృష్టించుచున్నావు, హరిః = విష్ణువై, ప్రాణిజాతమ్ = ప్రాణులయొక్క సమూహమును, ఆదరాత్ = ప్రేమతో, ధారయసి = నిలుపుచున్నావు. ఉగ్రరూపః = భయంకరరూపముగల రుద్రుఁడవై సమస్తమ్ = సర్వమైన, ప్రమేయమ్ = సృష్టిని, హరసి = నశింపఁజేయుచున్నావు, కః = ఎవఁడు, తవ = నీయొక్క, ఈదృక్ = ఇటువంటి, మహత్త్వం = గొప్పతనమును, అవగన్తుం = తెలిసికొనుటకు, ఈష్టే = సమర్థుఁడగును ?

తా॥ ఈశ్వరా ! నీవు బ్రహ్మవై సర్వలోకములను సృజింతువు. విష్ణువై సమస్తప్రాణులను కాపాడుదువు. రుద్రుఁడవై సర్వసృష్టిని నశింపఁజేతువు. ఇట్టి నీయొక్క గొప్పదనమును తెలియు నెవరికిని శక్యముకాదు.

జాగ్రత్కాలే విశ్వనామ్నా ప్రసిద్ధః
స్వప్నే చ త్వం తైజసాఖ్యాం బిభర్షి ।
ప్రాజ్ఞాభిఖ్యాం సమ్ప్రధత్సే సుషుప్త్యాం
బ్రహ్మాత్మాఖ్యాం తుర్యకాలే దధాసి॥

హర! = ఓయీశ్వరా! త్వం = నీవు, జాగ్రత్కాలే = మేల్కొనియున్నపుడు, విశ్వనామ్నా = విశ్వుడను పేరుతో, ప్రసిద్ధః = పేర్కొనబడి, స్వప్నే = నిద్రాకాలమందు, తైజసాఖ్యాం = తైజసుడను పేరును, బిభర్షి = ధరించుచున్నావు, సుషుప్త్యామ్ = గాఢనిద్రలో, ప్రాజ్ఞాభిఖ్యాం = ప్రాజ్ఞుఁడను పేరును, సంప్రధత్సే = ధరించుచున్నావు, తుర్యకాలే = మోక్షకాలమందు, బ్రహ్మేత్యాఖ్యాం = బ్రహ్మఅను పేరును, దధాసి = ధరించుచున్నావు.

తా. ఈశ్వరా! నీవు మేల్కొనియున్నపుడు 'విశ్వు'డనియు, నిద్రించునపుడు 'తైజసు' డనియు, గాఢనిద్రయందు 'ప్రాజ్ఞు' డనియు, మోక్షావస్థయందు 'బ్రహ్మ' యనియు వ్యవహరింపఁబడుచున్నావు.

జగద్రఙ్గ భూమి ర్నటా స్సర్వలోకాః
ప్రవేశ స్తథా నిష్క్రమ స్తత్ర తేషామ్ ।
ప్రధానం నటీ, త్వం కృతీ సూత్రధార
స్స్వయం చాక్షరః ప్రేక్షకో రూపకాణామ్ ॥ 26

హర = ఓ యీశ్వరా! జగత్ = లోకము, రంగభూమిః = ప్రదర్శనస్థలము, సర్వలోకాః = ప్రాణులందఱు, నటాః = నటులు, తత్ర = అక్కడ తేషామ్ = వారలకు, ప్రవేశః = ప్రవేశము, నిష్క్రమః = నిష్క్రమణము కలవు. ప్రధానం = ప్రకృతి, నటీ = నటియైయున్నది, కృతీ = నేర్పరియైన, త్వం = నీవు, సూత్రధారః = సూత్రధారుఁడవు, చ = మఱియు, స్వయం = స్వయముగా, రూపకాణాం = రూపకములకు, అక్షరః = నాశరహితుఁడైన, ప్రేక్షకః = ప్రేక్షకుఁడవు, అసి = అగుచున్నావు.

తా. ఈశ్వరా! ఈ ప్రపంచమంతయు ఒకనాటక రంగము. లోకులు నటులు. వారా నాటకరంగమునఁ బ్రవేశించి నిష్క్రమింతురు. ఆ నాటకములో ప్రకృతియే నటి; నేర్పుగల నీవు సూత్రధారుడవు; స్వయముగా ప్రేక్షకుఁడవుగా కూడ నుందువు.

లఘుత్వం గురుత్వం ద్రవత్వం ఘనత్వం
ప్రభుత్వం విభుత్వం వశిత్వం కృతిత్వమ్ ।
అణుత్వం మహత్త్వం తథైవంవిధా హే
ప్రభోఽన్యే ప్రభావాః శ్రితా స్త్వా మనన్తాః ॥ 27

హేప్రభో! = ఓ ఈశ్వరా! లఘుత్వం = తేలికగానుండుట, గుత్వం = బరువుగానుండుట, ద్రవత్వం = కరుగుట, ఘనత్వం = గట్టిపడుట, ప్రభుత్వం = శక్తిమంతుఁడగుట, విభుత్వం = సర్వవ్యాపియగుట, వశిత్వం = వశపఱచుకొను స్వభావము కలుగుట, కృతిత్వమ్ = సఫలత్వము, అణుత్వం = చాలచిన్నదియగుట, మహత్త్వం, = అన్నిటికంటె పెద్దదగుట, తథా = ఆ ప్రకారముగా, ఏవంవిధాః = ఇటువంటి, అన్యే = ఇతరములగు, అనంతాః = అంతులేని, ప్రభావాః = ప్రభావములు, త్వామ్ = నిన్ను, శ్రితాః = ఆశ్రయించి యున్నవి.

తా॥ ఈశ్వరా! నీవు లఘుత్వము, గురుత్వము, ద్రవత్వము, ఘనత్వము, ప్రభుత్వము, విభుత్వము, వశిత్వము, కృతిత్వము, అణుత్వము, మహత్త్వము మొదలగు ననేకప్రభావములను కలిగియున్నావు.

పునర్జన్మసాన్ద్రాభ్రఝంఝాసమీరో
మహాఘోరపాపాటవీజాతవేదాః ।
అవిద్యాతమిస్రచ్ఛటాచణ్డభానుః
భవన్నామమన్త్రః పినాకిన్! ముముక్షోః ॥ 28

పినాకిన్ = ఓయీశ్వరా, ముముక్షోః = మోక్షముకోరువానికి, భవన్నామమంత్రః=నీనామమనుమంత్రము, పునర్జన్మసాంద్రాభ్రఝంఝాసమీరః= మఱలమఱల పుట్టుటయను దట్టమైన మేఘములకు సుడిగాలివంటిది, మహాఘోరపాపాటవీజాతవేదాః = గొప్ప భయంకరమగు పాపములను అడవులకు అగ్ని

హోత్రియువంటిది, అవిద్యాతమిస్రచ్ఛటాచండభానుః = అజ్ఞానమను చీకటి సమూహమునకు తీక్ష్ణమగు సూర్యునివంటిది.

తా॥ ఈశ్వరా! నీ నామమంత్రము మోక్షకామియొక్క పునర్జన్మమను మేఘపంక్తిని సుడిగాలియై చెదరగొట్టును. ఘోరపాపములను అడవులను దావాగ్నియై కాల్చును. అజ్ఞానమను చీకటిని వేడి వెలుగై నశింపజేయును.

వదన్తి వైష్ణవా విష్ణుం, శాక్తాః శక్తిం, మహేశ్వరమ్।
శైవా, భవన్తమేవైవం నామరూపాన్తరగ్రహాత్ ॥ 29

హర = ఓయీశ్వరా! భవన్తమ్ = నిన్ను, వైష్ణవాః = విష్ణుభక్తులు, విష్ణుం = విష్ణువుగా, వదన్తి = చెప్పుచున్నారు, శాక్తాః = శక్త్యుపాసకులు, శక్తిం = శక్తినిగా, వదన్తి = చెప్పుచున్నారు, శైవాః = శివభక్తులు, భవన్తమేవ = నిన్నే, ఏవం = ఈవిధముగా, నామరూపాన్తరగ్రహాత్ = పేరు రూపము భిన్నముగా తీసికొనుటవలన, మహేశ్వరమ్ = మహేశ్వరునిగా వదన్తి = చెప్పుచున్నారు.

తా॥ ఈశ్వరా! నిన్ను వైష్ణవులు విష్ణువని, శాక్తులు శక్తియని, శైవులు శివుడని అనేక నామములతో బిలుచుచున్నారు. ఇదియంతయు ఆయా మతస్థులు వేర్వేరునామ రూపములను భావించి పూజించుటనుబట్టి కలిగినదే కాని సర్వేశ్వరుడవునీవే.

దధి స్వాదు తస్మాత్పయః స్వాదు తస్మా
న్మధు స్వాదు తస్మాత్కథా తావకీనా।
అభక్తాయ శంభో! కథం రోచతాం సా
ననుశ్శర్కరా స్వాద్ధి పిత్తార్దితస్య ॥ 30

శంభో = ఓయీశ్వరా! దధి = పెరుగు, స్వాదు = రుచికరము, తస్మాత్ = దానికంటె, పయః = పాలు, స్వాదు = రుచిగలవి, తస్మాత్ =

దానికంటె, మధు = తేనె, స్వాదు = తియ్యనిది, తస్మాత్ = దానికంటె తావకీనా = నీ సంబంధమగు కథా = కథ, రుచికరమైనది, అభక్తాయ = భక్తుఁడు కానివానికి, సా = ఆనీకథ, కథం = ఎట్లు రోచతాం = ఇష్టమగును ? పిత్తార్దితస్య = పైత్యముతో కూడినవానికి, శర్కరా = పంచదార, కటుః = చేదు, స్యాద్ధి = అగునుకదా !

తా. ఈశ్వరా ! పెరుగు రుచికలది. దానికంటె పాలు, దానికంటె తేనె మిక్కిలి రుచినిచ్చును. వీని యన్నిటికంటె నీయొక్క కథ ఎక్కుడు మాధుర్యముకలది. ఇది నీ భక్తుఁడు కానివానికి రుచింపదు. పైత్యరోగికి పంచదారకూడ చేదుగానుండును కదా !

క్రియాం ముక్తిహేతుం వదత్యేకసూరిః
పరం హేతు మన్యస్సుధీ రాత్మబోధమ్ ।
పరో భక్తిమేకాం భవోచ్చాటమన్త్రిమ్
గతిః కామమైవం స్థితే భిన్నభావే ॥ 31

హర! = ఓయీశ్వరా! ఏకసూరిః = ఒక విద్వాంసుఁడు, క్రియాం = క్రియను, ముక్తిహేతుం = మోక్షకారణముగా, వదతి = చెప్పుచున్నాఁడు, అన్యః సుధీః = మఱియొక పండితుఁడు ఆత్మబోధం = ఆత్మజ్ఞానమును, పరం = గొప్పదగు, హేతుం = ముక్తికి కారణముగా, వదతి = చెప్పుచున్నాఁడు, పరః = మఱియొక బుద్ధిమంతుఁడు, భక్తిం = భక్తిని, ఏకాం = ఒక్కదానినే, భవోచ్చాట మన్త్రిమ్ = జన్మరాహిత్యమంత్రమునుగా, వదతి = చెప్పును. భిన్నభావే = భిన్నాభిప్రాయము = ఏవం స్థితే = ఇట్లుండగా, గతిః = గతికి, కా = ఏమి?

తా. ఈశ్వరా ! ఒకానొక విద్వాంసుఁడు క్రియయే మోక్షహేతు వనును. మఱియొకపండితుఁడు ఆత్మజ్ఞానమువలన మోక్షములభించునని చెప్పును. ఒక్కభక్తియేజన్మరాహిత్యహేతువని యింకొక బుద్ధిమంతుఁడు నుడువును. ఇట్టి భిన్నాభిప్రాయములలో నేది నాకు సరియైనమార్గమో చూపింపుము?

యథా భిన్నమార్గాశ్రితానాం నదీనామ్
గతి స్సాగరో నాఽన్యఏవాఽస్తి లోకే ।
తథా భక్తిబోధ క్రియాణాం సృతీనామ్
బ్రువన్తి శ్రుతిజ్ఞా స్త్వమేవేతి గమ్యః ॥ 32

హర = ఓయీశ్వరా! భిన్నమార్గశ్రితానాం = వేర్వేరు మార్గములనుబట్టిన, నదీనాం = నదులకు, లోకే = లోకమునందు, గతిః = గమ్యస్థానము, యథా = ఎట్లు, సాగరః = సముద్రమో, అన్యః = ఇతరము, నాస్త్యేవ = లేదో, తథా = అట్లే, భక్తిబోధక్రియాణాం = భక్తిజ్ఞానక్రియలనెడి, సృతీనాం = పద్ధతులకు, గమ్యః = పొందఁదగినవాఁడవు, త్వమేవ = నీవే, ఇతి = అని, శ్రుతిజ్ఞాః = వేదవిదులు, బ్రువన్తి = చెప్పుచున్నారు.

తా. ఈశ్వరా! లోకములో నదులు వేర్వేఱు మార్గముల ప్రవహించి ఏ విధముగా సముద్రమునే ప్రవేశించునో, అట్లే భక్తి జ్ఞాన కర్మమార్గములచే నెట్లుపాసించినను నిన్నే చేరుదురని వేదవిదులు నుడువుచున్నారు.

వ్యతీతం శిశుత్వం గతం యౌవనం మే
క్షయ త్యల్పమాయు ర్దురాశా దురన్తా ।
హృతం హృచ్చ కామాదిభి శ్చఞ్చలం మా
మతః పాహి భక్తిం దిశం స్త్వ య్యనన్తామ్ ॥ 33

హర = ఓ యీశ్వరా! శిశుత్వం = బాల్యము, వ్యతీతం = గడచినది, మేఁ = నాయొక్క, యౌవను = పడుచుఁదనము, గతంపోయినది, అల్పమ్ = కొద్దిదైన, ఆయుః = ఆయుర్దాయము, క్షయతి = నశించుచున్నది, దురాశా = చెడ్డఆశ, దురన్తా = దుఃఖముఅంతము నందుకలది; చంచలం = చంచలమైన, హృచ్చ = హృదయము, కామాదిభిః = కామక్రోధమోహమదమాత్సర్యములచే, హృతం = హరింపఁబడినది, అతః = ఇందువలన, త్వయి నీయందు, = అనన్తామ్ = అంతులేని, భక్తిమ్ = భక్తిని, దిశ = ఇచ్చుచు, మాం = నన్ను, పాహి = రక్షింపుము.

తా॥ ఈశ్వరా! నాకు బాల్యయౌవనములు గడిచినవి. ఆయుశ్శేషము కూడ నశింపనున్నది. ఆశకు అంతులేదు. మనస్సు కామాది శత్రువర్గముచే చలించిపోయినది. కాబట్టినీపయి శాశ్వతమగు భక్తినొసఁగి నన్నుఁగాపాడుము.

మనః పావయ న్మే౽ నృతా ద్వారయ న్మామ్
హర న్సంశయాదీ న్దహ న్కర్మజాలమ్ ।
దిశ న్సత్త్వనిష్ఠాం వదం స్తద్రహస్యం
నయ న్మా మగమ్యం పదం పాహి శమ్భో ! ॥ 34

శంభో ! = ఓ యీశ్వరా ! మే నాయొక్క, మనః = మనస్సును, పావయన్ = పవిత్రముగా చేయుచు, మామ్ = నన్ను, అనృతాత్ = అశుద్ధము నుండి, వారయన్ = నివారించుచు, సంశయాదీన్ = సందేహము మొదలగు వానిని, హరన్ = పోఁగొట్టుచు, కర్మజాలమ్ = కర్మసమూహమును, దహన్ = దహించుచు, సత్త్వనిష్ఠాం = సత్త్వమందు నిశ్చలత్వమును, దిశన్ = ఇచ్చుచు, తద్రహస్యం = ఆరహస్యమును, వదన్ = చెప్పుచు, మామ్ = నన్ను అగమ్యం = పొందశక్యముకాని, పదం = స్థానమును, నయన్ = పొందించుచు, పాహి = రక్షించుము.

తా. ఈశ్వరా ! నాహృదయమును నిర్మలముగానుంచి నన్నుబద్ధ మాడింపక, సందేహములను పోఁగొట్టుచు, కర్మలను నశింపఁజేసి, ఆ రహస్యము నెఱింగించి, దానియందు నిష్ఠకలుగఁజేసి నన్నుఁజేరరాని నీ స్థానమునుచేర్చి రక్షించుము.

విజిత్యారిషట్కం గృహీత్వా శమాదీన్
గురో స్తత్త్వమస్యాదివాక్యా న్యజస్రమ్
సమాకర్ణ్య బుద్ధ్వా దృఢం చిన్తయిత్వా
భవత్త్వ మాత్మ న్యహం నిర్విశామి ॥ 35

హర = ఓ యీశ్వరా! అరిషట్కం = శత్రువులగు కామక్రోధాదులను, విజిత్య = జయించి, శమాదీన్ = శమము మొదలగు వానిని, గృహీత్వా =

గ్రహించి, గురోః = గురువువలన, తత్త్వమస్యాదివాక్యాని = తత్త్వమసి మొదలగు వాక్యములను, అజస్రం = మాటిమాటికి, సమాకర్ణ్య = విని, బుధ్వా = తెలిసికొని, దృఢం = గట్టిగా, చింతయిత్వా = ఆలోచించి, భవత్తత్త్వమ్ = నీయొక్క నిజస్వరూపమును, ఆత్మని = ఆత్మలో, అహం = నేను, నిర్విశామి = అనుభవించుచున్నాను.

తా. ఈశ్వరా ! కామము క్రోధము మొదలగు ఆర్గురు శత్రువులను జయించి, శమాదులను గ్రహించి, సద్గురువువలన తత్త్వమస్యాది వాక్యముల ఎల్లప్పుడువిని, తెలిసికొని, విచారించి నీయొక్క యథార్థ స్వరూపమును నాయాత్మలో ననుభవింతును.

యథా దుస్సఖైః స్సంప్రలుబ్ధః ప్రయాతో
విదేశం ప్రబుద్ధ స్సుతః ప్రైతి తాతమ్ ।
తథా కూటమిత్రైః స్సమస్తేన్ద్రియైర్మే
ఽభిభూతో భవన్తం శ్రయా మ్యద్య శమ్భో ! ॥ 36

శంభో = ఓయీశ్వరా! దుస్సఖైః = చెడ్డస్నేహితులచే, సంప్రలుబ్ధః = బాగుగా మోసగింపఁబడినవాఁడై, విదేశం = ఇతరదేశమును, ప్రయాతః = పొందింపఁబడి, ప్రబుద్ధః = తెలిసికొన్నవాఁడై, యథా = ఎట్లు, సుతః = కుమారుఁడు, తాతమ్ = తండ్రిని, ప్రైతి = పొందుచున్నాఁడో, తథా = అట్లే, కూటమిత్రైః = దుష్టసహవాసులగు, మే = నాయొక్క సమస్తేంద్రియైః = అన్నియింద్రియములచేత, అభిభూతః = అవమానితుఁడనై, భవన్తం = నిన్ను, అద్య = ఇప్పుడు, శ్రయామి = ఆశ్రయించుచున్నాను.

తా. ఈశ్వరా ! లోకములో నొక బాలుఁడు చెడు స్నేహితుల వలలోఁబడి విదేశముఁ బోయి తెలివిఁదెచ్చుకొని ఎట్లుతిరిగి తండ్రిని ఆశ్రయించునో అట్లే నేను నాదుష్ట సహవాసులగు నింద్రియములచే తిరస్కృతుఁడనై తెలిసికొని నిన్నాశ్రయించుచున్నాను.

త్వమేవాఽసి మే మానసే రాజహంస

స్త్వమేవాఽసి మే నేత్రపద్మాంశుమాలీ ।

త్వమేవాఽసి శంభో ! మదీయం నిధానం

త్వమేవాఽసి విశ్వం న కోఽప్యస్తి మేఽన్యః ॥ 37

శంభో = ఓ యీశ్వరా ! మే = నాయొక్క, మానసే = మనస్సునందు, రాజహంసః = రాజహంసవు, త్వమేవ = నీవే, అసి = అగుచున్నావు. మే = నాయొక్క, నేత్రపద్మాంశుమాలీ = నేత్రములను పద్మములకు సూర్యునివంటివాఁడవు, త్వమేవ = నీవే, అసి = అగుచున్నావు, మదీయ = నా సంబంధమైన, నిధానం = నిధివి, త్వమేవ = నీవే, అసి = అగుచున్నావు, విశ్వం = సమస్తము, త్వమేవ = నీవే, అసి = అగుచున్నావు, మే = నాకు, అన్యః = ఇతరుఁడు, కోఽపి = ఎవఁడును, నాస్తి = లేఁడు.

తా. ఈశ్వరా ! నీవే నా మానససరోవరమునందలి రాజహంసవు. నా నేత్రపద్మములకు సూర్యుఁడవు నీవే. నాకు ముఖ్యమగు నిధివి నీవే. వేయేల ? సర్వమును నాకు నీవే కాని వేఱొండు లేదు.



చిరం యాచమానం హర ! త్వాం విముక్తిమ్

న మాం త్యక్తుమర్హ స్యనాథం వరాకమ్ ।

భవా న్దీనబన్ధు ర్భవా న్భక్తభాగ్యమ్

కథం స్త్రాయసే త్వాం యదీమాం న యచ్ఛేః 38

హర = ఓ యీశ్వరా ! త్వాం = నిన్ను, చిరం = చాలాకాలమునుండి, విముక్తిం = మోక్షమును, యాచమానం = కోరుచున్నట్టియు, అనాథం = దిక్కులేనట్టియు, వరాకం = హీనుఁడనగు, మాం = నన్ను, త్యక్తుమ్ = విడచుటకు, నార్హసి = తగినవాఁడవు, భవాన్ = నీవు,

భక్తభాగ్యమ్ = భక్తులకు సంపదయైనవాఁడవును అగుచున్నావు, ఇమాం = ఈ ముక్తిని, యదినయచ్ఛేః = ఒసఁగకున్నచో, కథం = ఎట్లు, స్తూయసే = స్తోత్రము చేయఁబడుదువు ?

తా. ఈశ్వరా! నిన్ను చాలాకాలముగా ముక్తినిమ్మని కోరుచుంటిని. దిక్కులేనివాఁడను, హీనుఁడను. ఇట్టి నన్ను వదలుట నీకుఁ బాడిగాదు. నీవు దీనబంధుఁడవు, భక్తభాగ్యమవు. నాకు ముక్తినొసఁగని యెడల నిన్నెట్లు స్తుతింతును ?

క్షమస్వాపరాధా న్మదీయా నశేషాన్
మమాఽయం జనో దాస ఇత్యాదరా త్త్వమ్ ।
అభీక్ష్ణం నమామి స్మరారే! భవ న్తమ్
ప్రణామావసానా హి దాసాపరాధాః॥ 39

స్మరారే = మన్మథుని శత్రువగు నో యీశ్వరా! మదీయాన్ = నాసంబంధమగు, అశేషాన్ = సమస్తములైన, అపరాధాన్ = తప్పులను, అయంజనః = ఇతఁడు, మమ = నాయొక్క. దాసః = సేవకుఁడు, ఇతి = అని,ఆదరాత్ = గౌరవమువలన, త్వం = నీవు, క్షమస్వ = క్షమించుము, భవన్తం = నిన్ను, అభీక్ష్ణం = మాటిమాటికి, నమామి = నమస్కరింతును, దాసాపరాధాః = దాసునితప్పులు, ప్రణామావసానాహి = నమస్కారముతో నశించిపోవును గదా!

తా॥ ఈశ్వరా! నేను చాల తప్పులను చేసితిని. నీవు ఇతఁడు నా దాసుఁడను ప్రేమతో నన్ను క్షమింప వేఁడుచున్నాను. నీకనేక పర్యాయములు నమస్కరించుచుతును. దాసునితప్పులు దండముతో సరిగదా!

నరీతి ర్న పాకో నశయ్యా నశుద్ధి
ర్న హృద్యశ్చ భావః స్తవే మత్కృతేఽస్మిన్ ।
తథాఽప్యాద్రియేథా స్సుణజ్ఞా యదేతమ్
తవైవానుభావో భవే ద్దేవ! హేతుః ॥ 40

దేవ = ఈశ్వరా, మత్కృతే = నాచేతచేయఁబడిన, అస్మిన్ = ఈ స్తవే = స్తోత్రమునందు, రీతిః = విశిష్టశబ్దములకూర్పు, న = లేదు, పాకః = అర్థగంభీరిమ, న = లేదు, శయ్యా = శయ్యయును, న = లేదు, శుద్ధిః = పరిశుద్ధియు, న = లేదు, హృద్యః — మనోహరమగు, భావశ్చ = భావమును, న = లేదు, తథాఽపి = అట్లయినప్పటికి, గుణజ్ఞాః గుణము తెలిసినవారు, ఏతమ్ = దీనిని ఆద్రియేరన్ యత్ = ఆదరింతురనుట యేదికలదో దానికి, = తవ నీయొక్క, అనుభావఏవ = అనుగ్రహమే, హేతుః = కారణము, భవేత్ = అగును.

తా॥ఈశ్వరా ! నేనొర్చిన యీస్తోత్రమునందు రీతిగాని, పాకముగాని, శయ్యగాని, శుద్ధిగాని లేదు. మనోహరమగు భావముకూడలేదు. అట్లయినను గుణగ్రాహులు దీనిని ఆదరించినచో నది నీ యనుగ్రహమువలననే యగును.

లిఖతః పఠతః పిబత శ్చరతో
దదతో జపత స్తపతో వదతః ।
అదతో నమత స్స్వపతో మమ హృత్
పదపఙ్కజయో స్తవ సంవసతు ॥ 41

దేవ = ఓ యీశ్వరా, లిఖతః = వ్రాయుచున్నట్టియు, పఠతః = చదువుచున్నట్టియు, పిబతః = నీరుత్రాగుచున్నట్టియు, చరతః = తిరుగుచున్నట్టియు దదతః = ఇచ్చుచున్నట్టియు, జపతః = జపము చేయుచున్నట్టియు, తపతః = తపస్సుచేయుచున్నట్టియు, వదతః = చెప్పుచున్నట్టియు అదతః = తినుచున్నట్టియు, నమతః = నమస్కరించుచున్నట్టియు, స్వపతః = నిద్రబోవుచున్నట్టియు, మమ = నాయొక్క, హృత్ = హృదయము, తవ = నీయొక్క, పదపఙ్కజయోః = పాదపద్మములయందు, సంవసతు = ఉండును గాక.

తా॥ ఈశ్వరా ! నేను వ్రాయుచున్నను, చదువుచున్నను, తిరుగుచున్నను, దానము జపము తపము చేయుచున్నను, మాట్లాడుచున్నను, తిను

చున్నను, నిద్రబోవుచున్నను ఏమిచేయుచున్నను నా హృదయము మాత్రము నీపాద పద్మములయందు మాత్రమే ఉండుగాక.

అన్నంభట్టస్య విజ్ఞస్య వంశే జాతేన ధీమతః ।
కృష్ణస్య శ్రౌతదక్షస్య లక్ష్మీకాంతేన సూనునా ॥ 42

మయా స్తుతిరియం భక్త్యా ప్రణీతా ప్రీతయే తవ ।
త్వత్పాదపద్మయో రద్య న్యస్తా స్వీక్రియతాం విభో! ॥ 43

విజ్ఞస్య = పండితుడును తర్కసంగ్రహదీపికాది రచయితయు గరికపాట్యుపనామకుఁడునగు, అన్నంభట్టస్య = అన్నంభట్టు యొక్క, వంశే = వంశమునందు, జాతేన = పుట్టినట్టియు, ధీమతః = పండితుఁడును, శ్రౌతదక్షస్య = శ్రౌతమునందు సమర్థుఁడునగు, కృష్ణస్య = కృష్ణయ్యయొక్క, సూనునా = కుమారుఁడునగు, లక్ష్మీకాంతేన = లక్ష్మీకాంతయ్య అను, మయా = నాచేత, ఇయం స్తుతిః = ఈస్తోత్రము, తవ నీయొక్క, ప్రీతయే = సంతోషము కొఱకు, భక్త్యా = భక్తితో, ప్రణీతా = చేయఁబడినదై, అద్య = ఇప్పుడు, త్వత్పాద పద్మయోః = నీపాదపద్మములయందు, న్యస్తా = ఉంచఁబడినది, హేవిభో = ఓ ప్రభూ!, స్వీక్రియతాం = స్వీకరింతువుగాక !

తా. ఈశ్వరా! పండితుఁడగు గరికపాటి అన్నంభట్టు యొక్క వంశమునందు పుట్టినట్టియు, శ్రౌతమున గట్టి పండితుఁనునగు కృష్ణయ్య కుమారుఁడును లక్ష్మీకాంతయ్య యను నేను ఈస్తోత్రమును భక్తితో [illegible] నీప్రీతి కొఱకు నీపా[illegible]చుచున్నాను. దీనిని స్వీకరింపఁగోరెదను.